ఓం శ్రీః

శ్రీమత్ పరమగురుభ్యోనమః

ముముక్షువుల కత్యంతోపయుక్తంబగు

# శ్రీయలమంద కోటీశ్వర శతకము.

ఈ గ్రంథము నర్సారావుపేట తాలూకా కోటీశ్వరక్షేత్ర
నివాసియు, నచలగురు సాంప్రదాయకుండును నగు

## బెల్లంకొండ కోటినాగయ్యదాసుచే

రచియింపఁబడి

బాపట్ల తాలూకా ముట్లూరు గ్రామ కాపురస్థులు ఆకుల
కోటిలింగయ్యగారివల్లను, యింకా కొంతమంది
మహనీయుల వల్లను
పరిచూడబడి

రేపల్లెతాలూకా మాచవరం గ్రామ వాస్తవ్యులు
అలపర్తి వెంకయ్యచౌదరిగారి ధర్మపత్నియగు
వేంకాయమ్మగారి ద్రవ్యసహాయమున

నిడుబ్రోలు:
తాతా ముద్రాక్షరశాల యందు
ముద్రింపఁబడియె.

1934

ఓం శ్రీగురవేనమః

# ఇష్టదేవతా ప్రార్థన

---

## సీసమాలిక

శ్రీమించు కైలాస శివు నివాసంబైన
మహిలోన మాయల్లమందకొండ
ఓషధీకుధరంబు కుర్వీలోసమమైన
మహిలోన మాయల్లమందకొండ
ధరసాదుబృందముకు తిరుమలగిరిసాటి
మహిలోన మాయల్లమందకొండ
అణిమగరిమామొదలు అష్టసిద్ధులనొసగు
మహిలోన మాయల్లమందకొండ
వసుధ.యాదవమణి యొప్పుగానందున్న
మహిలోన మాయల్లమందకొండ
ఇలను ఋష్యాదుల బిలములుగలిగున్న
మహిలోన మాయల్లమందకొండ

గీ॥ వందనీయము మాయల్లమందకొండ
అందముకుమేటి మాయల్లమందకొండ
మంచుకొండల్లు దుండెల్లమందకొండ
మంచిక్షేత్రము యను యల్లమందకొండ
మానుగా కోటిలింగని జ్ఞానకొండ
మహిని నాయీశు నుతియింతు మనసునిండ.

॥ అలకైలాస నగంబటంచు మిగులం ఆద్యేశుడంచున్ సదా
మెలగుంబర్వతమందటంచు బుధులేమెల్లన్ సుఖంబుంటి మం
చెలమిన్ జెప్పెడి మాటలెల్లనిజమా నీకొండ కైలాసమా
యలమందేశ్వర నీవెకావవలెనయ్యా నన్ను కోటీశ్వరా.

। బ్రోచుటరిత్తైనయెడ బోవదె నీదు మహాత్మ్యమియ్యెడన్
యోచలిగట్టుచూలి చెయినొప్పఁగబట్టిన పార్వతీశ్వరా
బూచులరేడనిన్నమది బూనితినాదు హృదంతరస్థమై
దాచినకోర్కెలన్నిటిని తప్పకతీర్పుపురారి యీతరిన్.

౩॥ భక్తునిచేత నీమహిమ ప్రజ్వరిలున్ గద భవ్యతేజనన్
రిక్తునిచేయనీదు ఘనశ్రేయప్రదుండను కీర్తిపోవదే
శుక్తిపుటంబునన్ బడిన శుద్ధజలంబును ముత్తియంబులా
శక్తిసమేత అవ్విధమె సార్థకమౌగద నీమహాత్మ్యమున్

౪॥ వసుధన్ బెల్లముకొండ వంశజలధిన్ వర్ణింపతన్నీరధిన్
అసమానప్రభగాంచి యోగపరతత్త్వారూఢిగైకొన్న యా
కుసుమాస్త్రారిపదాబ్జభక్తుడను మద్గోత్రంబువృషభాఖ్యయిం
పెసగంగన్ భగిసూత్రమున్ పొడవటిన్ జెన్నొందెనసర్వేశ్వరా

---

ఓం శ్రీసద్గురవేనమః

శ్రీమదోంకార ప్రణవతత్వవిదులారా, కోవిదులారా!

అస్యశ్రీ యలమందకోటీశ్వర శతకము కేవల పరనానందమేగాక జ్ఞానానందమయమై జన్మసార్థకమొందు చతుర్విధోపాయములును జననరాహిత్య విధోపాయసూచనలును జననాగమనాత్పూర్వ గర్భస్థపిండ నవమాస గర్భనరక బాధా సంప్రాప్త దుఃఖానలంబును తత్తన్మాసాభి వృద్ధిపిండక్రమంబును జన్మాంతర కర్తవ్యంబును పంచభూతాంతర పంచీకరణ నిర్ణయంబును హంస గమనాగమన సంజ్ఞాపూర్వ రేచక పూరక కుంభక క్రిమంబును జ్ఞానేంద్రియ కర్మేంద్రియ నిర్మాణంబును సాంఖ్యతారకామనస్క యోగ గ్రాహ్యానుకూలంబును తద్వారా ముముక్షత్వమార్గజ్ఞానాభిలాషోదయంబును పండిత పామరులకు దెల్లముగా తెలియునటుల శ్రీ పరమహంస నిత్యానంద రాజయోగి బెల్లంకొండ కోటినాగార్యులు యీగ్రంథము వ్రాసినందులకు నే నెంతయో కృతజ్ఞుడను. వేదాంత విషయముననను కవిత్వ విషయముననను నాకెక్కుడు బరిచిత లేకపోయినను సత్సాంగత్యముననుయించుకెరింగి యీపీఠిక వ్రాసినందులకు తప్పొప్పులమన్నింప ప్రార్థితుడ.

అచ్చుకు సహాయము చేసినవారలను పరమేశ్వరుడు రక్షించుగాత.

ఇట్లు, బుధజనవిధేయుడు,

ఆకుల కోటిలింగయ్య,

ముట్లూరు గ్రామం

బాపట్ల తాలూకా.

ఓం శ్రీ చంద్రశేఖరాయనమః

# శ్రీయలమంద కోటీశ్వర శతకము.

(నారాయణశతకము మాదిరిగా చదువవలెను.)

శ్రీభక్తహృదయవాసా - మౌనిజన
సేవ్యత్రికూటవాసా
శోభితామలవికాసా - మమ్మేలు
శుభదృష్టి కోటీశ్వరా ౧

శ్రీశాంభవీతనయుని - పూజించి
శ్రీవ్యాసముఖుల దలచి
శ్రీశారదను స్మరించి - శతకంబు
చేసితిని కోటీశ్వరా ౨

జననిజనకుల దలచియు - గురువరుని
మనమునం బ్రార్థించియు
వినయమున బుధకవులకు - ప్రణమిల్లి
వేడెదను కోటీశ్వరా 3

ఛందస్సునేచూడగా - లేదు మరి
శాస్త్రముల్ చదువలేదు
చంద్రశేఖరుని కృపచే - చెప్పితిని
శతకంబు కోటీశ్వరా ౪

తప్పులున్నను కరుణచే - సైరించి
యొప్పులుగ భావింపుడీ

గొప్పతనమునకుగాదు - భక్తిచే
చెప్పితిని కోటీశ్వరా ౫

సిరముగా భక్తతతికి - ధరకల్ప
తరువువై వెలసినావు
కరుణతో రక్షింపను - యలమంద
గిరివాస కోటీశ్వరా ౬

ఆదిదేవుడ వనుచును - నామదిని
మోదముతో నమ్మినాను
వాదమేలను శంకరా - యలమంద
వాసశ్రీ కోటీశ్వరా ౭

భక్తిచే నీపాదముల్ - హృత్పద్మ
పంజరంబున నిల్పియు
ముక్తికోరకై వేడితి - యలమంద
భక్తనుత కోటీశ్వరా ౮

వేషభాషలచేతను - నేచాల
దోషముల జేసినాను
శేషభూషణుడ బ్రోవు - యలమంద
పోషశ్రీ కోటీశ్వరా ౯

నేర్పుచేనినుగాంచక - నేచాల
నేరములు జేసినాను
భారమనకనుబ్రోవరా - యలమంద
భవనశ్రీ కోటీశ్వరా ౧౦

ప్రాపునీవనివేడితి - నన్నుతమ
దాపునకు జేర్పమంటి
నాపాలి శివుడబ్రోవు - యలమంద
నగవాస కోటీశ్వరా ౧౧

భక్తపోషణరాగదే - నాకిపుడు
ముక్తిమార్గము జూపవే
రిక్తుడను ననుగావుము - కరుణచే
భక్తనుత కోటీశ్వరా ౧౨

నీభక్తపాదధూళి - శిరమందు
నిరతంబు దాల్చుచుండు
నాభవంబుల దున్మించుము - యలమంద
నగవాస కోటీశ్వరా ౧౩

పుట్టించుటకును నీవే - జీవులను
పోషించుటకును నీవే
గిట్టించుటకును నీవే - యలమంద
గిరివాస కోటీశ్వరా ౧౪

పూర్వజన్మమునందున - నే జేయు
పుణ్యపాపములవలన
ధామణిలో జననమైతి - యలమంద
ధామశ్రీ కోటీశ్వరా ౧౫

కామాంధకారమునను - నే నెంతో
కామించి తిరిగినాను

నీమాయ గననేరక - యలమంద
నిలయశ్రీ కోటీశ్వరా ౧౬

పరుల సౌఖ్యములజూచి - యీర్ష్యచే
పరుషములు బల్కినాను
హర్షించిననుబ్రోవరా - యలమంద
గిరినిలయ కోటీశ్వరా ౧౭

బుద్ధిహీనతచేతను - మునుచాల
బుధజనుల బొంకించితి
బుద్ధివచ్చెను శంకరా - యలమంద
పురనాథ కోటీశ్వరా ౧౮

క్రూరుండు పీడించును - ననునీవు
వేగ కాయుము మీశ్వరా
కోరివేడితి శంకరా - యలమంద
కొండశ్రీ కోటీశ్వరా ౧౯

తప్పులెన్నియొ జేసితి - మన్నించి
దయతోడ బ్రోచుటకును
ఒప్పులకుప్పవమ్మ - యలమంద
నొప్పశ్రీ కోటీశ్వరా ౨౦

తనయుండు జేసినట్టి - తప్పులను
తలిదండ్రి సైచినట్లు
ఘనతచే నాతప్పులు - క్షమియించి
కావుమిక కోటీశ్వరా ౨౧

బలముగలవాడవయ్యా - భక్తులకు
బలమునీవేగదయ్యా
బలమిచ్చి నన్నుబ్రోవుము - యలమంద
భవనశ్రీ కోటీశ్వరా ౧౨
పూజలేప్రొద్దుజేసి - నీసేవ
పూర్ణముగ జేయుచుంటి
పూజితుండవు శంకరా - యలమంద
పురదేవ కోటీశ్వరా ౧౩
నీసేవజేయనట్టి - నరులకును
దోషములు దొలగవనుచు
నాసక్తిగొలుచుచుంటి - యలమంద
వాసశ్రీ కోటీశ్వరా ౧౪
చనినకాలమె మంచిది - తమపాద
సరసిజంబుల గొల్చితి
జనకుండవని వేడితి - యలమంద
సదనశ్రీ కోటీశ్వరా ౧౫
గురిలేనివాడనయ్యా - గురిగనక
గురునింద జేసినాను
గురిజూపినను బ్రోవుము - యలమంద
గిరివాస కోటీశ్వరా ౧౬
మన్మధుని వైరివయ్యా - నాహృదయ
మందిరంబందు నిలువు
సన్మునులహృదయ కమల - మందున్న
సదయ శ్రీ కోటీశ్వరా ౧౭

వ్రతము లెన్నెన్నో జేసి - మాజనని
సుతులకై నినుగుతించి
వ్రతమూర్తి నీవరమున - ననుగనియె
వసుధలో కోటీశ్వరా ౨౮
నీపేరుబెట్టినారు - నాతల్లి
నీకుపూజలుశాయగా
నీపోషణని బెరిగితి - యలమంద
నిలయశ్రీ కోటీశ్వరా ౨౯
అనువొంద నీనామము - స్మరియింప
యమునిదూతలు రారని
అనుదినము స్మరియించెద - యలమంద
జనవినుత కోటీశ్వరా 30
పరమాత్మ నీభక్తుల - రక్షింప
బిరుదుబూనినవాడవు
కరుణతో నన్నేలరా - యలమంద
పురనిలయ కోటీశ్వరా 3౧
ఓంకారరూపుండవు - నాకున్న
సంకటంబుల బాపవే
పొంకముగ నీవాడను - యలమంద
పురవాస కోటీశ్వరా 3౨
నంద్శననుగావరా - హృత్కమల
మందునిను పొందుపరచి
అందముగ వేడుచుంటి - యలమంద
మందిరా కోటీశ్వరా 33

మహితాత్మ మిమునమ్మియు - తమస్మరణ
మానకను స్మరియించెద
నిహబంధములఁద్రోయుకు - యలమంద
మహనీయ కోటీశ్వరా ౩౪
శివశివాశివయనుచును - నెల్లపుడు
శివమహాదేవయనుచు
శివనిన్ను పూజించెద - యలమంద
శిఖరశ్రీ కోటీశ్వరా ౩౫
ఎంత వేడిన బలుకవు - నాయందు
నింతకఠినంబేలను
వంతనొందుచునుంటిని - యలమంద
వాసశ్రీ కోటీశ్వరా ౩౬
ఏమనుజునకునైనను - నిలలోన
నీమాయ దెలియవశమా
సామాన్యమాశంకరా - యలమంద
సామిశ్రీ కోటీశ్వరా ౩౭
వృక్షమాదిగ నెనుబది - నాలుగు
లక్షలా జీవులందు
దీక్షబుట్టుచు గిట్టుచు - నుంటిగద
దేవనుత కోటీశ్వరా ౩౮
కర్మచే నిలబుట్టియు - జీవులు
కర్మములు జేయుచుండి
కర్మచేతను గిట్టుచు - మఱుజన్మ
గాంచెదరు కోటీశ్వరా ౩౯

తనువు విడచెడివేళకు - జీవునకు
తనకోర్కె వృద్ధిపొంది
అనువుగా చిత్రగుప్త - పఠమందు
మనసుండు కోటీశ్వరా ४०

తన యనుభవము దీరగా - జీవుండు
తానున్న తనువు విడచి
మును సూక్ష్మరూపమునను - రవి కిరణ
ముల చనును కోటీశ్వరా ४౧

గగనంబులో జేరియు - వర్షంబు
గా గురియు బిందువులతో
తగజేరి భూమియందు - జలమందు
తానుండు కోటీశ్వరా ४౨

సలిలంబులందు జేరి - జీవుండు
సస్యంబుగా బెరిగియు
నిల నోషధిగ మాఱును - యలమంద
నిలయ శ్రీ కోటీశ్వరా ४३

ధరణి నోషధులెల్లను - నన్నమై
తరుణి పురుషులయందున
వర శుక్లశోణితముగా - నుండు శ్రీ
గిరివాస కోటీశ్వరా ४४

సతిపతులు గూడినపుడు - గర్భమున
ఋతువేళ కమలమందు
నతి శుక్లశోణితములు - గలసియు
నండమగు కోటీశ్వరా ४೫

పదియైదు దినములకును - ముద్దయై
పదిలముగ బెరుగుచుండు
విదితముగ మాసమునకు - పిండమై
కుదురు శ్రీ కోటీశ్వరా ౪౬

కుదురుగా రెండవ నెలన్ - శిరసును
మెదడేరుపడియుండును
ముదముతో మూడవ నెలన్ - హృదయంబు
నుదరమూ కోటీశ్వరా ౪౭

విరివిగా నాల్గవ నెలన్ - కంఠంబు
కరపాదములుగల్గియు
నరము నెముకలు మాంసము - ధాతువుల్
సరియౌను కోటీశ్వరా ౪౮

కరమొప్ప నైదవ నెలన్ - నోరునున్
ఘ్రాణంబు నేత్రయుగము
నరయు నఖములు రోమముల్ - నాళ్ళన్ని
స్థిరపడును కోటీశ్వరా ౪౯

అరయుగా నారవ నెలన్ - మావిచే
స్థిరముగా జుట్టబడియు
వరజనని గర్భమందు - దిరుగుచును
వర్థిల్లు కోటీశ్వరా ౫౦

మొనసి యేడవ నెలకును - జీవుండు
తనతల్లి కుక్షియందు
తనపూర్వ జన్మ దెలసి - చింతించు
తాను శ్రీ కోటీశ్వరా ౫౧

ఈమురికి కూపమందు - నెన్నాళ్లు
స్వామినే నుందునయ్యా
ప్రేమచే ననుగావుమా - యికనైన
వెడలించి కోటీశ్వరా ౫౨

మూత్రముల కూపమందు - నేనిపుడు
మునిగి తేలుచునుంటిని
సూత్రంబు దెలపిగావు - యలమంద
క్షేత్ర శ్రీ కోటీశ్వరా ౫౩

అష్టమంబగు మాసము - ప్రాప్తించె
కష్టముల కోర్వలేను
దృష్టినాయందుంబరపి - బాధలను
దీర్చు శ్రీ కోటీశ్వరా ౫౪

ఈకష్ట మీడేర్చరా - నన్నిపుడు
చేకొనియు రక్షింపరా
నాకు నెవ్వరుదిక్కురా - యలమంద
నగవాస కోటీశ్వరా ౫౫

చిక్కి పొరలుచునుంటిని - నాకిపుడు
దిక్కునీవేశంకరా
నిక్కమెరుగనివాడను - యలమంద
నిలయ శ్రీ కోటీశ్వరా ౫౬

నిండుచీకటికోనరా - నేనిప్పు
డుండలేకను వేడితి
దండిమేటివి యీశ్వరా - యలమంద
ధామ శ్రీ కోటీశ్వరా ౫౭

నిబ్బరించగలేనురా - వేగమే
తబ్బిబ్బు జెందెమనసు
ఇబ్బంది దాటించరా - యలమంద
యీశ శ్రీ కోటీశ్వరా ౫౮
గొప్ప లంచములు మేసి - నే ముచ్చు
తప్పు సాక్ష్యములుకూసి
చెప్పరానట్టియఘము - లెన్నెన్నొ
జేసితినో కోటీశ్వరా ౫౯
శిశుహత్య జేసినానో - లేక నే
స్త్రీహత్య జేసినానో
పశుహత్య జేసినానో - యలమంద
పరిపాల కోటీశ్వరా ౬౦
గురునింద జేసినానో - గాక నే
పరసతుల బొందినానో
భరియింపలేను తండ్రీ - యీ గర్భ
వాసంబు కోటీశ్వరా ౬౧
ఎంతకష్టమువచ్చెరా - నేను ము
న్నెంత పాపము జేసితో
యెంత వేడిన బలుకవు - యలమంద
నేలు శ్రీ కోటీశ్వరా ౬౨
నవమాసములు నిండెరా - నన్నిపుడు
భవకూపమెడలించరా
భువిజేరి నినువేడెద - యలమంద
భవన శ్రీ కోటీశ్వరా ౬౩

దశమాసములు నిండగా - నాతల్లి
తాను శ్వాసమువిడిచిన
దిశలేమిదెలియనాయె - భవహారణ
దితిజహార కోటీశ్వరా ౬౪

తల్లిగర్భమునందున - సూత్రికను
చల్లనగు వాయువొకటి
మెల్లన నధోముఖముగా - వెడలించు
మేదినికి కోటీశ్వరా ౬౫

తొల్లిజేసినకర్మచే - నేనపుడు
తల్లిద్వారమ్మువలన
చల్లగా ప్రసవించగా - బుట్టితిని
జగతిపై కోటీశ్వరా ౬౬

అంతెపయి మంత్రసాని - కలిసీళ్ళ
నందిపై జల్లగాను
ఇంతింతకనులెత్తియు - క్యావుమని
యేడ్చితిని కోటీశ్వరా ౬౭

తల్లడిల్లుచు నేడ్వగా - నాకపుడు
కొల్లుగుంటను ద్రవ్వి
మెల్లగా నొడలిమురికి - వెడలించి
రెల్లెడల కోటీశ్వరా ౬౮

ఒడలుదుడిచియు వేగమే - నాతల్లి
యొద్ద ననుపండవేయ
కడునాకలిజనించెను - నాకపుడు
కడుపులో కోటీశ్వరా ౬౯

తల్లిపొత్తిలియందున - పెరుగుచును
తగమూత్ర మలములందు
తల్లడిలి పొర్లాడుచు - జనపితిని
తలచికొంత కోటీశ్వరా ౨౦

కిసరుపోరును సంధులు - గడచియును
పొసగి పొత్తిలియందున
దశదినంబులు జరిగెను - నీదయను
ధరణిలో కోటీశ్వరా ౨౧

వరుసగా పదిరోజులు - వెళ్లంగ
పురుడుబాపగ జేసిరి
విరివిగాపేరుబెట్టి - పెంచిరిల
వింతగా కోటీశ్వరా ౨౨

అత్తత్త యననేర్చియు - నాచేతు
లెత్తుకొమ్మని యిచ్చియు
కొత్తమాటలునేర్చితి - నీదయను
కొలదిగను కోటీశ్వరా 23

దోగాడగానేర్చితి - ధరణిపై
వేగనడువగనేర్చితి
బాగుగా దిననేర్చితి - యలమంద
భవన శ్రీ కోటీశ్వరా ౨౪

బాలప్రాయమునందున - నాయీడు
బాలురతో గూడుకొనుచు
బాలకేళులు సల్పితి - యలమంద
భవన శ్రీ కోటీశ్వరా ౨౫

యౌవనం బరుడెంచగా - కామమను
క్రొవ్వు కన్నులగప్పగా
నవ్వుచును పరస్త్రీలతో - చెనటినై
నడిచితిని కోటీశ్వరా ౨౬

ప్రాయంబు వచ్చెననుచు - మావారు
హాయిగా బెండ్లిసేయ
భాయకా సతినిగూడి - నినుగాన
భావమున కోటీశ్వరా ౨౭

సతిసుతుల పోషింపను - నేతప్పు
సాక్ష్యముల్ బల్కినాను
అతిధనంబులగూర్చితి - పలుబొంకు
లాడితిని కోటీశ్వరా ౨౮

కౌమార దశయందున - సతిసుతుల
క్రమముగా గూడుకొనియు
విమలబోధనములేక - శ్రమనొంది
విసికితిని కోటీశ్వరా ౨౯

అంధత్వ బధిరత్వముల్ - వృద్ధత్వ
మందు వేగమె గల్గెను
తందనాంచను దేహము - చాలగా
తలవణకె కోటీశ్వరా ౩౦

ధర్మమెట్టిదొ గానక - నే దుష్ట
కర్మములు జేసినాను
నిర్మలంబగు జ్ఞానము - నాకెట్లు
నిలుచు శ్రీ కోటీశ్వరా ౩౧

ఎంతచిత్రం బాయెను - నాకింత
నెటుల మోక్షముగల్గును
ఎంతవిఘ్నవచ్చెననుచు - జీవుండు
చింతించె కోటీశ్వరా ౧౨

నీటిపై బుగ్గగాను - దేహంబు
నిలువబో దస్థిరమురా
యేటికీ యీ మోహము - యలమంద
యీశ శ్రీ కోటీశ్వరా ౧౩

ఇట్టి దేహంబుపైన - మోహంబు
పెట్టుకొని మోసపోతి
గట్టిగా గురుని జేరి - నన్ను నే
గనవైతి కోటీశ్వరా ౧౪

దేశికస్వామివగుచు - వచ్చియును
జేసితివుపదేశము
దోసమ్ము లెడబాసెను - యలమంద
వాస శ్రీ కోటీశ్వరా ౧౫

సో యనుచు పూరకంబు - లోపలికి
పోయికుంభకమగుచును
హం యనుచు రేచకంబు - వెలికొచ్చు
హరనామ కోటీశ్వరా ౧౬

చూపుమనసును హంసతో - గూర్చియును
చోటెరిగి జపియించగా
నీపగిది తారకంబు - స్థిరముగా
నెసగు శ్రీ కోటీశ్వరా ౧౭

ముందు పరమాత్మయందు - నవ్యక్త
మందున మహత్తత్వము
అందునను హంకారము - ననుగల్గె
నతిమాయ కోటీశ్వరా ౮౮

అందు ప్రణవముజనించె - శబ్దంబు
నందొదవె నాకాశము
అందు వాయువుగల్గెను - యలమంద
నలరు శ్రీ కోటీశ్వరా ౮౯

అందగ్నియందు జలము - నందు భువి
యందు నోషధులుగల్గె
నందన్నమందు శుక్లం - బున సృష్టి
యమరె శ్రీ కోటీశ్వరా ౯౦

గగనమున సగభాగము - జ్ఞాతమై
మిగిలియుండిన భాగము
తగవహ్నిజలమున భువిఁ - వాయువున
దగగలసె కోటీశ్వరా ౯౧

మనసు బుద్ధియుచిత్తము - హంకార
మనగ నంతఃకరణముల్
తనరె నాలుగువిధములై - పంచభూ
తములిట్లు కోటీశ్వరా ౯౨

వాయువులో సగభాగము - వ్యానమై
వరుస మిగిలినభాగము
తోయమాకాశమగ్ని - భూమిలో
తోడ్పడెను కోటీశ్వరా ౯౩

ప్రాణంబపానంబును - వ్యానము స
మానంబు దానమూనె
పూనిపవనుని పంచకం - బనియొప్పె
పుడమిలో కోటీశ్వరా ౬౧

తగనగ్నిలోనసగము - చక్షువై
మిగిలియున్నట్టిసగము
గగనమున జలమున భువిఁ - వాయువుస
గలసె శ్రీ కోటీశ్వరా ౬౨

అవియె శ్రోత్రత్వక్కులుఁ - ఘ్రాణజి
హ్వాలోచనంబులయ్యె
నివియగ్ని పంచకంబు - యలమంద
యీశ శ్రీ కోటీశ్వరా ౬౩

తోయమున నర్థాంశము - రసమయ్యె
దోడరి మిగిలినభాగము
వాయువగ్నియు గగనము - పృథివిలో
వడిగలసె కోటీశ్వరా ౬౪

రూపశబ్దస్పర్శము - గంధరస
రూపంబులం దాల్చెను
రూపింపజలపంచకం - బనియొప్పె
రూఢిగా కోటీశ్వరా ౬౫

పృథివిలో సగభాగము - గంధమై
వెలసె మిగిలినభాగము
ఉదకమాకాశమగ్ని - వాయువుల
గదసె శ్రీ కోటీశ్వరా ౬౬

గుదము పాదము పాణియు - వాక్కును
గుహ్యంబు లాయెనిదియె
ముదముగ కర్మేంద్రియపంచకం - బనియొప్పె
ముక్కంటి కోటీశ్వరా ౧౦౦
చెరి యిరువదియైదును - తత్వములు
కారణస్థూలసూక్ష్మ
శారీరములు మూడుగా - వర్ధిల్లె
శరణు శ్రీ కోటీశ్వరా ౧౦౧
మూడు దేహములందున - జీవుండు
మూడవస్థలు జెందుచు
పీడకను సుఖదుఃఖముల్ - జెందుచును
వెలయు శ్రీ కోటీశ్వరా ౧౦౨
పంచభూతంబులైదు - గుర్తెరగి
పంచివివరించిజూడ
అంచితంబుగ సాంఖ్యమం - చనుచుందు
రార్యులిల కోటీశ్వరా ౧౦౩
తన్నుదా తెలసికొనియు -తనకున్న
తనువుతా గానిదెరిగి
తన్నుతా జూచుకొనుటె - యమనస్క
మెన్నదగు కోటీశ్వరా ౧౦౪
నీమాయ దెలసికొంటి - నీదయచె
నిన్ను నే గనుచునుంటి
సామీప్యపదవిగంటి యలమంద
సదన శ్రీ కోటశ్వరా ౧౦౫

ధరణి బెల్లంకొండ - పిచ్చయకును
తరుణి శ్రీ సోమమాంబ
వరగర్భ తనయుండు - నగ్రజుడ
వసుధలో కోటీశ్వరా ౧౦౬

కోటినాగయ్య యనుచు - తమభక్త
కోటిలోనున్నవాడ
మేటిదేశకు కరుణచే - నినుగంటి
చోటెరిగి కోటీశ్వరా ౧౦౭

ఇలను మానవులుదీనిని - చదివినను
నెలమి వినినను వ్రాసినను
తులలేని వైభవంబు - సుగతిగాం
తురు వారు కోటీశ్వరా ౧౦౮

రవి చంద్రులుండువరకు - శతకంబు
రంజిల్లుచుండునట్లు
శివనిన్ను వేడుచుంటి - రక్షింపు
భవహరణ కోటీశ్వరా ౧౦౯

మంగళము దేశికేంద్రా - మమ్మేలు
మంగళము గురువరేణ్య
మంగళము చంద్రమౌళి - నిత్యశుభ
మంగళము కోటీశ్వరా ౧౧౦

## —♦ గద్యము ♦—

ఇది శ్రీదేశికేంద్ర చరణారవింద రసాస్వాదనతుందిలేందిందిరాయమాన మానసుండును; శ్రీబెల్లంకొండ వంశపయఃపారావారాపరిపూర్ణ రాకాసుధాకరుండును, వృషభగోత్ర పవిత్రాలంకార చరిత్రుడును, శ్రీ పిచ్చయ్యసోమమాంబా గర్భ శుక్తిముక్తాఫలుండును, పాశుపతాద్యనేకోపాసనాసిద్ధ్య శ్రీ పరమహంసస్వరూప నిత్యానంద రాజయోగి కోటినాగార్య ప్రణీతంబైన శ్రీయల్లమంద కోటీశ్వర శతకము

సంపూర్ణము.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

శ్రీ కోటీశ్వరార్పణమస్తు.



